# సోమాలియా పైరేట్ల గురించి
# చిన్న వ్యాసము

**By VARANASI SREE RAMA KRISHNA - AMARAVATHI**



సోమాలియా దొంగల ముఠా గురించి **1--02- 24**

**31 -01-24** న ఆలిండియా రేడియోలో - సోమాలియా దొంగలు - పాకిస్తానుకు చెందిన ఒక నౌకను స్వాధీనము చెర పట్టి స్వాధీనము చేసుకున్నారని - భారత్ జోక్యం చేసుకొని ఆ నౌకను

విడిపించిందని వార్తలు వచ్చాయి . అందువల్ల ఈ సోమాలియా గురించి

అంతర్ జాతీయ వార్తలలో కూడా " సోమాలియా పైరేట్లు { ఓడ దొంగలు} భాలనా నౌకను స్వాధీనము చేసుకున్నారు అని- తరచూ వార్తలు వస్తూ ఉంటాయి . సోమాలీ దేశము పైరేట్లకు / దొంగలకు స్వర్గ ధామము అనుకుంటూ, ఈ దేశముగురించిన మంచి చెడూ అన్నీ కూడా తెలుసుకుందాము .

ఆఫ్రికా ఖండములో ఒక చిన్న దేశము సోమాలియా .ఈ దేశానికీ **3,025 km** సముద్ర తీరము వున్నది . ఈ సముద్ర తీరములో కొంత ఇండియన్ ఓషన్ ని మరికొంత గల్ఫ్ అఫ్ ఈడెన్ ను అనుకోని ఉంటుంది . గల్ఫ్ అంటే - ఒక సన్నని మార్గము ద్వారా సముద్రపు నీరు లోనికి చొచ్చుకొని వచ్చి - ఒక పెద్ద చెరువులా ఏర్పడిన చోటు . మన చెవుని ఉదాహరణగా తీసుకోండి . చెవు బయట ఎంతో ఉంటుంది . చెవిలోనికి వెళ్లే రంధ్రము ఎంతో సన్నగా ఉంటుంది . ఈ రంధ్రము తరువాత భాగము మళ్ళీ విశాలము అవుతుంది . గల్ఫ్ అంటే అట్లా ఉంటుంది .

సోమాలియా ప్రకృతి సౌందర్యానికి చక్కని బీచులకీ ప్రసిద్ధి .

ఏనాడో - పురాతన గ్రీస్ దేశము నుండి అరేబియన్ పెనిన్సులా { మూడువైపులా నీరువున్న ద్వీపకల్పం ని పెనిన్సులా అంటారు }   వచ్చి స్థిర పడిన  వారిని అరేబియన్లు అంటారు . సోమాలీలు  అరబ్బీలు. భాష అరబ్బీ . అందువల్ల వీరికి అరబ్బీ దేశాల నుండి మద్దత్తు ఉంటుంది .

ఈ సోమాలియాలో ఎప్పుడూ ఎదో ఒక అంతర్యుదము ము నడుస్తూ ఉంటుంది .ప్రభుత్వము  మిలటరీ వారి అధీనములో ఉంటుంది . మిలటరీ పాలనలో కూడా కొన్ని రకాలు ఉండగా - ఇక్కడ    " జుంటా " అన్న రకం మిలిటరీ పాలన వున్నది  . " జుంటా " అంటే  ప్రభుత్వ అధికారము అంతా ఒకటికన్నా ఎక్కువమంది మిలిటరీ అధికారుల చేతుల్లో ఉంటుంది . ఈ అధికారులకింద ఇంకా కొందరు మిలటరీ అధికారులు సహాయకులుగా వుంటారు . ఈ సహాయకులనే జుంటాలు అంటారు . ఇట్లగా చాలా మంది అధికారుల చేతుల్లో అధికారము ఉండటం వల్ల - అతి గొప్ప అధికారిని పడదోసి-  ప్రభుత్వలోని ముఖ్య పదవిని  చేచిక్కించుకోవటానికి అని-  చిన్న మిలటరీ అధికారులు తరచూ తిరుగు బాట్లు   చేస్తూ వుంటారు .  తిరుగు బాటు చేసే ప్రతి మిలట్రీ వాడూ తాను ప్రజల పక్షాన నిలబడి తిరుగుబాటును చేస్తున్నాను అంటూ ప్రకటిస్తాడు . ఈ మిలిటరీ  తిరుగు బాటునే సోమాలీలో  సివిల్ వార్ అంటారు . అందువల్ల ఈ దేశములో ఎప్పుడూ స్థిర మైన ప్రభుత్వము ఉండదు .

తరచూ తిరుగుబాట్లు జరుగుతూ ఉండటం వల్ల మిలటరీ అధికారులకు ఆయుధాలు అవసరం ఉంటుంది . ఆయుధాలను  అమెరికా వంటి దేశాలే అమ్మతాయి. మిలిటరీ వారు తమ దేశపు పన్నులనుండి ఆయుధాలకు కావాల్సిన సొమ్ము చెల్లిస్తారు అనుకుంటే .... తిరుగుబాటు దారులకు కావాల్సిన ఆయుధాలకు సొమ్ము ఎక్కడనుండి వస్తుంది  ? వీరికి సోమాలియా దొంగల నుండీ కొంత వాటా వస్తుంది .దానితో వీరు ఆయుధాలు కొనుక్కుంటారు . ప్రత్యుపకారంగా సోమాలీ దొంగలకు ప్రభుత్వ పెద్దలు అండగా నిలుస్తారు .

దొంగలు వారూ వీరు అని తేడా లేకుండా అన్ని దేశాల వాణిజ్య నౌకలను పట్టుకుని తమ స్వాధీనం లో పెట్టుకొని - నౌకలోని సరుకును సముద్రము పాలు చేయకుండాను - నౌకా సిబ్బందిని చంపకుండా విడిచిపుచ్చటానికి గానూ లక్షల కొద్దీఅమెరికన్ డాలర్లు డిమాండ్ చేస్తారు . ఇక అన్ని దేశాలు కూడా లక్షల కొద్దీ అమెరికన్ డాలర్లను దాచుకొని వుండవు కదా ? అందువల్ల తమ దగ్గర- **{ఆక్షణం లో}** తగినన్ని డాలర్లు లేని దేశాలు - అమెరికాను శరణు చొచ్చి డాలర్లు తెచ్చుకుంటాయి . డాలర్లు అప్పు ఇచ్చిన అమెరికా - అప్పు పొందిన దేశాలనుండి చౌకగా ముడి ఖనిజాలను - ఆహార పదార్థాలను దిగుమతి చేసుకుని - వాటిని తన ప్రజలకు అందుబాటులోకి తెస్తుంది . సోమాలీలు ఈ డాలర్లను వెచ్చించి ఆయుధాలను కొంటారు కాబట్టి ఇది కూడా అమెరికాకి లాభం ఇస్తుంది .అమెరికా ఈ సోమాలీ దొంగలను కట్టడి చేస్తుంది కానీ - సందర్భాన్ని పట్టి నింపాదిగా అలోచించి , కొంత మెతక వైఖరి కనపరుస్తూ చేస్తూ ఉంటుంది .

ఇహ సోమాలీకి **3,025 km** సముద్ర తీరము వుంది కదా ? అమెరికా తనదేశములో వున్నా ప్లాస్టిక్ చెత్త- మెడికల్ చెత్త - ఎలక్ట్రానిక్ చెత్త అంతటినీ ఈ సోమాలిలో వున్న చిన్న చిన్న

కంపెనీలకు పంపిస్తుంది . ఈ కంపెనీలు ఆ చెత్తను పర్యావరణ కు ముప్పు కలగని విధంగా

రీసైకిల్ చేయాల్సి ఉంటుంది . కానీ ఈ కంపెనీలు వచ్చిన చెత్తను వచ్చినట్లు తమ సముద్రంలో పారవేస్తుంది . నేడు సోమాలీ తీరము టన్నుల టన్నుల ప్లాస్టిక్ చెత్త తో నిండి ఉంటుంది . అమెరికా చెత్తను స్వీకరించి - అమెరికాను శుభ్రంగా ఉంచటంలో సోమాలీ బాగా ఉపయోగ పడుతుండటం వల్ల కూడా -- సోమాలి దేశము పట్ల అమెరికాకు ఒక మెతక వైఖరి వుంది.

మన దేశములో మున్సిపాలిటీ గ్రామ పంచాయితీ వంటి వి ఉంటే - వాటికి చెత్తను నిర్మూలించాల్సిన చట్టపరమైన భాద్యత ఉంటుంది . కానీ సోమాలీ మున్సిపాలిటీలకు ఈ భాద్యత లేదు . అందువల్ల సోమాలీ లోని అధిక భూ భాగము కూడా చెత్త మరియు కుళ్ళు పదార్థాలతో ఉంటుంది

. సోమాలీదొంగలు ఒకసారి అనుకోకుండా - యుద్ధము లో వాడే బాంబులను మోసుకు వెడుతున్న - ఒక ఉక్రేన్ నౌకను చెర పట్టారు . తాము ఆ నౌకను నీటిలో ముంచి వేస్తాము లేదా ఆ బాంబులన్నింటినీ నిప్పు వేసి అంటిచుతాము అని బెదిరించి న ఈ సోమాలీ దొంగలు ఉక్రేన్ దేశము ద్వారా **32** లక్షల అమెరికన్ డాలర్లు రాబట్టు కున్నారు . వీరి సంపాదన ఆ రేంజి లో ఉంటుంది .

# సోమాలీ దొంగల చేతిలో ఒక ఓడ

.

సోమాలియా దొంగల చేతికి చిక్కిన **MV Faina** అనే నౌక కు సంభందించిన నిజమైన కథతో పాటు చిన్న చిన్న విజ్ఞ్యాన పరమైన విషయాలు కూడా కొన్ని చెపుతాను .

**MV** అనగా మెర్చెంట్ వెహికల్ **{** అనగా ప్రైవేట్ నౌక **}**

ప్రపంచము లోని అనేక భాషలకు సంస్కృతము మూలము . సంస్కృతము **1500 - 500** నుండీ ఉన్నట్లు లిఖిత పూర్వక ఆధారాలు కనపడుతాయి . సంస్కృతం ఇండో యూరోపియన్ లాంగ్వేజీ కుటుంబము లోది . ఇదే భాషా కుటుంబము లోని సాల్విక్ అనే భాష ను మాట్లాడే ప్రజలు వున్న భూ భాగములో పెద్ద భాగాన్ని ఉక్రేన్ అని ఆ సాల్విక్ భాషను మాట్లాడే వారిని ఉక్రేనియన్ లు అని అంటారు .

మనము చెప్పుకోబోతున్న **Faina** అన్న నౌక ఉక్రేన్ కి లోని బడా వ్యాపారులకు చెందినది .

ఈ నౌక **"**రోల్ ఆన్ **/** రోల్ ఆఫ్ నౌక**"** అనే కేటగిరీలో ని నౌక . అంటే ఏవస్తువు నైనా సరే **-** ఒక చక్రాల బండిలో పెట్టి ఈ నౌకలోకి ఎక్కించ వచ్చు **-** లేదా దింపేయ వచ్చు . ఈ నౌక నిర్మాణం అలా ఉంటుంది . ఇందువల్ల ఓడలలోని సరుకును పెద్దగా సౌకర్యాలు లేని ఓడరేవుల్లో కూడా దింపవచ్చు **-** ఎక్కించవచ్చు .అట్లాగే ఎటువంటి సామాన్యమైన కూలీ

ద్వారానైనా కూడా సరుకును ఎక్కించ వచ్చు దించవచ్చు . ఇప్పుడు మనము నౌకలలో వుండే రకాలలో ఒక రకము తెలుసుకున్నాము .

**Faina** అనే నౌక ఉక్రేన్ దేశపు వ్యాపారస్థులది - కానీ ఇది **Belize** అనే వూరు పేరు లేని ఒక చిన్న దేశములో రిజిస్టర్ అయ్యి ఉంది . ఒకదేశము యొక్క ఓడ - వేరే దేశములో రిజిస్టర్ అయినపుడు దాన్ని "ఫ్లాగ్ అఫ్ కన్వీనియన్స్ షిప్" అంటారు .

పన్నులు ఎగవేయటానికి - తమ దేశపు చట్ట పరిధినుండి తప్పించుకోవటానికి - వ్యాపారంలో తమను అధికంగా ప్రశ్నించకుండా ఉండటానికి గానూ - నౌక సొంత దారులు తమ నౌకలను "ఫ్లాగ్ అఫ్ కన్వీనియెన్స్" కింద- చిన్న చిన్న దేశాలలో రిజిస్టర్ చేస్తారు . ఈ రిజిస్ట్రేషన్ ఫీజు ద్వారా చిన్న చిన్న దేశాలు డాలర్లు సంపాదిస్తాయి. . ఈ ఓడ రెండు దేశాలలోని నౌకాశ్రయాలలో ఎటువంటి ఆటంకము లేకుండా తిరుగుతుంది .ఈ బెలిజ్ దేశము పక్కనే మెక్సికో దేశము వున్నది . నౌక ఓనర్లు ఉక్రేన్ లో వున్న **Odessa** అనే పట్నంలో వుంటారు . ఈ పట్టణము ఉక్రేన్ లోని పెద్ద నౌకా వ్యాపార కేంద్రము . **2022.**రష్యా ఉక్రేన్ యుద్ధములో ఈ పట్టణము కూడా టార్గెట్ ఐయ్యింది .

సోమాలి పైరేట్లు { నౌకా దోపిడీ ముఠా } ఈ నౌకను **25 September 2008,**న తమ స్వాధీనము చేసుకున్నారు . తాము కోస్ట్ గార్డులము అని నమ్మ పలికి వీరు ఓడలోకి ప్రవేశించారు . ఈ ముఠా కి నాయకుడు **Mohamed Abdi** హస్సన్. ఓడలో **21** మంది సిబ్బంది వున్నారు . ముగ్గురు ఇందులో ఒకరైన **Vladimir Kolobkov,** అనే రష్యన్ , తనకు వచ్చిన బీపీ తట్టుకోలేక మరణించాడు . ఇప్పుడు ఇరవై మంది మిగిలారు .

ఈ నౌక తన సరుకులతో కెన్యా దేశములో వున్న మొంబాసా అనే ఓడరేవుకు వెడుతున్నది అని అధికారిక సమాచారము . లోపలి సరుకు ఏమిటి అన్నది ఎవరికీ తెలియదు . దీనిలో రష్యాలో తయారు ఐన **47** యుద్ధ ట్యాంకులు - రాకెట్ లాంచర్లు - బాంబులు - యాంటీ ఎయిర్ క్రాఫ్ట్

గన్నులు - తుపాకులూ తూటాలు వంటివి వున్నవి . కానీ  ఓడలోని కాగితాలను పట్టి  - ఆ  ఆయుధాలు కెన్యా దేశానికి కాక - సుడాన్ లో వున్న జుబా అనేచిన్న  ఓడ రేవుకు పోతున్నట్లు తేలింది .

సోమాలీ దొంగలు ఈ నౌకను స్వాధీనము చేసుకొని చెరపట్టి - ఆయుధాలతో నిండిన ఈ ఓడను పేల్చి వేస్తాము అని బెదిరించి న  ఇరవై మిలియన్ అమెరికన్ డాలర్లు కావాలని డిమాండ్ చేసింది . డిమాండ్ ఎలా చేస్తారు ? అంటే ఎదో ఒక అంతర్ జాతీయ టీవీ వారికి వీడియో తో కూడిన  వార్తను అంద చేస్తారు. ఈ వార్తను చూసి ఎవరు బెదిరితే వారు వచ్చి బేరసారాలకు దిగుతారు .

పైరేట్లు మొదట డబ్బు అడిగి --  తరువాత మాకు  డబ్బు వద్దు కానీ  - నౌకను సోమాలియా దేశం తీసుకుపోతాము - మాకు ఏ కోస్ట్ గార్డులు అడ్డంకులు కల్పించ వద్దు అని డిమాండ్ చేసింది .   నౌకలో ఆయుధాలు వున్నవి - అవి ఉగ్రవాదులకు చిక్కుతాయి ఏమో ? అన్న భయంతో అమెరికా జోక్యం చేసుకొని - తన నౌక చుట్టూ తన నౌకలను  మోహరించి - ఆయుధాలు వున్న ఈ నౌక కదలకుండా కట్టడి చేసి ఆ ఆయుధాలు ఏ ఓడరేవుల్లోనూ  కూడా దింపే అవకాశం లేకుండా చేసింది .ఇక చేసేది ఏమీ లేక సోమాలీ దొంగలు " మేము ఏమైనా కొన్ని చిన్నచిన్న  ఆయుధాలు దింపుకొని వాటిని అమ్ముకుంటాము దానికైనా ఒప్పుకోండి అని అమెరికాని కోరింది.

రుష్యా , సోమాలియా , ఉక్రేన్ అమెరికా మరియూ ఇంగ్లాండ్ దేశాలు కలిసి ఈ ఓడను విడిపించి తీసుకో వాలని నిర్ణయించుకున్నాయి. ఈ నౌక తన సరుకులతో కెన్యా దేశములో వున్న మోంబాసా అనే ఓడరేవుకు వెడుతున్నది అని చెప్పుకున్నాము కదా ? ఆ కెన్యా దేశము వారు ఓడను విడిపించే ప్రయత్నాలలో పాల్గొన లేదు .

ఓడను పట్టుకున్నది సోమాలీ దేశానికీ చెందిన దొంగలు క దా**?** అందువల్ల సోమాలీ దేశము " మా దేశపు దొంగలను మీరు తుదముట్టిస్తే మాకు అభ్యంతరం లేదు " అని చెప్పి ఊరుకుంది . అప్పుడు సోమాలీ దేశములో అంతర్గత తిరుగుబాటును ప్రోత్సహిస్తూ ఉన్న **Harakat al-Shabaab al-**ముజాహిదీన్ -- అనే మిలిటెంట్ --- దొంగలను ప్రోత్సహించి - " ఓడను వదిలిపేసేటందుకు అమెరికానుండి డబ్బు గుంజండి లేదంటే ఓడను బాంబులతో సహా తగుల పెట్టండి లేదా నీటి లో ముంచి వేయండి. ఓడలో ఉన్న మీరు మతం కోసమని ఆత్మాహుతికి సిద్ధ పదండి " " అనే పిలుపు ఇచ్చాడు .

**Harakat al-Shabaab al-**ముజాహిదీన్ అనే మిలిటెంట్ సంస్థ అనేది**--** ఇస్లాం మత సంప్రదాయాలను అనుసరించి సోమాలియాలో ప్రభుత్వ పాలన సాగాలని డిమాండ్ చేస్తూ - ఆయుధాలు చేబూని - సోమాలియా దేశపు మిలిటరీ తో యుద్దము చేస్తూ ఉంటుంది .వారికీ డబ్బు కావలి కదా **?** వారికి ఈ పైరేట్లే డబ్బు వనరులు . పైరేట్లకు అలంటి నాయకులే వెన్నెముక .

అమెరికాఒక పెద్దన్న లాగా అందరి మీదా కర్ర పెత్తనము చేస్తూ ఉంటుంది అని ఒక అభిప్రాయము వున్నది . కానీ ఇలాంటి పరిస్థితులు వచ్చినపుడు ప్రపంచాన్ని రక్షించే భాద్యత మరియూ దానికి అయ్యే ఖర్చూ కూడా అమెరికాకే తగులుతూ ఉంటుంది . ఇలాంటి భాద్యత తీసుకున్నందు వల్లనే అనేక దేశాలు అమెరికాని ఆశ్రయించుతాయి .

అమెరికా డబ్బు చెల్లించటానికి నిరాకరించి ఓడ కదలకుండా నిర్బంధించి ఉంచింది . ఈ నిర్బంధాన్ని తట్టుకోలేని సోమాలీ పైరేట్లు - ఉక్రేన్ లో ఉన్న ఓడ సొంత దారులకు కబురుపెట్టి - ' "మీరు అమెరికాను ఒప్పించి - మాకు డబ్బిచ్చి మీ ఓడను - అందులోని ఆయుధాలను విడిపించుకోండి - లేదా బాంబులన్నింటిని పేల్చి వేస్తాము" అని డిమాండ్ చేశారు .
చేయబోయే నష్టాన్ని ఊహాతీతము చేయటమే ఉగ్రవాదుల వ్యూహము . దీన్ని ట్విన్ టవర్స్ ధ్వంసం లో కూడా ప్రదర్శించారు. సముద్రము మధ్యలో

ఉన్న ఓడలో - వందలాది బాంబులు మంటలలో కాలి పేలుతూ ఉంటే ఎలా ఉంటుందో ? దేన్నీ నష్ట పరుస్తుందో?" అన్నది ఎవరి ఊహకు అందలేదు .అందువల్ల - **5 February 2009** న ఉక్రేన్ లోని ఈ నౌక యజమానులు **32** లక్షల అమెరికన్ డాలర్లు **ee**దొంగల ముఠాకు చెల్లించి తమ నౌకను విడిపించుకున్నారు . నౌకలో ని **20** మంది సిబ్బంది ఉక్రేన్ చేరుకున్నారు . చివరికి ఓడ కెన్యాలో ఉన్న మోంబాసా ఓడ రేవుకు చేరుకుంది . కెన్యా దేశము ఈ ఓడలోని యుద్ధ ట్యాంకులను - బాంబులను - మందుగుండును ఏమి చేసిందో -- ఎవరికీ తెలియ నివ్వలేదు .

అందువల్ల మనము కెన్యా దేశము గురించి కూడా ఎప్పుడో ఒకప్పుడు తెలుసుకోవాల్సిందే .

.



**ABOVE IS MV Manifa**

పరిశోధన వివరణ సమర్పణ వారణాసి శ్రీ రామ కృష్ణ అమరావతి

**—-----------------------------------------------**

# సోమాలీ దొంగల చేతిలో మరొక ఓడ

సోమాలీ దొంగలు చెరపట్టి నిర్బంధంలోకి తీసుకున్న నౌకలలో అతి పెద్దది **MV Manifa {**మనీఫా**}** . ఇది **-** గల్ఫ్ దేశాలనుండి వివిధ దేశాల ఆయిల్ రిఫైనరీలకి ఒకే దెబ్బలో **2.2 million barrels** క్రూడ్ ఆయిల్ ని తీసుకు వెళుతుంది . సౌదీ అరేబియా కి చెందిన ఒక ధనిక కుటుంబము దీని ఓనర్లు. వీరు పెట్టిన ఆయిల్ కంపెనీ లో ఇలాంటి ఓడలు **19** వున్నవి . దీనిని బట్టి చూస్తే దుబాయ్ సేట్లు పెట్రోల్ వల్ల ఎంత సంపన్నులయ్యారో అనేది మన అంచనాకు అందదు .

ఓడను మొదట వెస్ట్ ఆఫ్రికాకు చెందిన లైబీరియా దేశము లో రిజిస్టర్ చేశారు **-** ఇది కూడా ఫ్లాగ్ అఫ్ కన్వీనియెన్స్ కింద రిజిస్టర్ అయ్యింది . ఇలారెజిస్టర్ చేయటం అనేది తన సొంత దేశానికి పన్నులు ఎగవేసే టందుకే అని ఇంతకు ముందే వివరించాను . ఇప్పుడు ఏమిటంటే ఎంత కోటీశ్వరునికైనా సరే పన్ను ఎగవేతకు మించిన ఇష్టము ఉండదు . దేశసంపదను ఉపయోగించుకొనేకదా బాగు పడ్డాను **-** పన్ను కడితే **-** అది చిట్టచివరికి ఆయన దేశప్రజలకే కదా ఉపయోగ పడేది**?** అని ఆలోచించరు .ఇంట్లోని సొమ్ము బయటికి పోయినట్లు ఫీల్ అవటం ప్రతి వ్యాపారికి ప్రకృతి నేర్పిన ధర్మం **?** చివరికి ఎందుకో ఈ కూడా **k** సౌదీ అరేబియా రిజిస్ట్రేషన్ తీసుకుంది

.

ఇకముందు మనము తెలుసుకో బోతూ ఉన్న సోమాలీ దొంగల నాయకుడు - పేరు **Mohamed Abdi** హస్సన్ నాయకత్వం లో పనిచేస్తుంన్న దొంగల ముఠా **5 November 2008,**న ఈ నౌకా సిబ్బందిని చెర పట్టి ఓడను నిర్బంధించినది . ఈ క్రూడ్ ఆయిల్ నౌక సౌదీ అరేబియా నుండి అమెరికా కు - వయా -- కేప్ అఫ్ గుడ్ హోప్ వెడుతున్నది . {కేఫ్ అఫ్ గుడ్ హోప్ అనేది సౌత్ ఆఫ్రికాని అంటుకుని వున్న అట్లాంటికు మహాసముద్రము యొక్క తీర భాగము .అట్లాంటిక్ మహాసముద్రము మనకు ఉన్న సముద్రములలో రొండో పెద్ద సముద్రము .దీని తీర రేఖ **85,133,000 km2 (32,870,000 sq mi).**ఉంటుంది. ప్రపంచములోని **17%** భూభాగాన్ని దీని ద్వారా చేరవచ్చు } ఇతర ప్రపంచ దేశాలనుండి - ఆఫ్రికా యూరోపు - ఆసియ దేశాలను ఈ సముద్రమే విడదీసింది } .

ఈ సౌదీ నౌక అమెరికాకి పోతూ - కెన్యా దేశానికి **830** కిలోమీటర్ల ఆవల ఉండగా - దాన్ని సోమాలియా దొంగలు పట్టుకున్నారు . నౌకలో **25** మంది సిబ్బంది - ఓడ నిండా క్రూడ్ ఆయిల్ వుంది . ఓడ విలువ **150** మిలియన్ యు యూ ఎస్ డాలర్లు అని చమురు విలువ **100** మిలియన్ యు ఎస్ డాలర్లు అని లెక్క కట్టారు . మనము గమనించాల్సింది ఏమంటే కెన్యా ప్రస్తాపన ఇక్కడకూడా వచ్చింది . సోమాలియా దొంగలు సముద్రములోపల వందల కిలోమీటర్ల దూరం కూడా చొచ్చుకు పోయి ఓడలను హైజాక్ చేస్తూ వున్నారు అని . **9 January 2009** న నౌక సొంత దారులు **$3** మిలియన్ డాలర్లు చెల్లించి ఈ ఓడను విడిపించుకున్నారు . ఇట్లాటి వాటివల్ల మీ బండిలో పడే పెట్రోల్ విలువ ఇంకో పావలా పెరుగుతూ ఉంటుంది

ఇది కాక **Samho Dream** అనే సౌత్ కొరియన్ నౌక ఆయిల్ తో ఇరాక్ నుండి అమెరికా వెడుతూ ఉండగా దాన్ని కూడా నిర్బంధించి - ఆ నౌకను

విడిచి పుచ్చి నందుకు గానూ సోమాలీ దొంగలు తొమ్మిది మిలియన్ అమెరికన్ డాలర్లు తీసుకున్నారు . పైరేట్ దొంగల తరపుఫున పని చేసిన మధ్యవర్తి ప్రెస్ వారితో **Mohamed** అనే తమ నాయకుడు ఈ సొమ్ము ఇస్తే గానీ ఓడను వదలవద్దు అని మాకు ఆర్డర్లు వేసాడు అని చెప్పాడు . ఓడ ను **271** రోజుల పాటు సోమాలీ దొంగల అదుపులో ఉండి చివరకి బయట పడింది . లేదంటే ఓడను **Haradheere,** అనే చోటుకు పంపించి వేస్తాము అని బెదిరించాడు. హారదీరే అనేది సోమాలియా లోని ఒక ఓడరేవు .దొంగిలించిన ఓడను అక్కడికి తరలించి దానిలోని సరుకు అమ్ముకుంటారు -ఆపై దానిని గాలికి వదిలేస్తే అది తుప్పు పట్టి చిల్లులు పది దాని అంతటా అది సముద్రములో మునిగి పోతుంది .

పై నౌకా నిర్బంధాలకు సోమాలీ లో ఉన్న **Mohamed Abdi** హస్సన్. అనే అయన నాయకుడు. గల్ఫ్ అఫ్ ఈడెన్ ను మరియూ సోమాలి సముద్ర తీరాన్ని ఆధారం చేసుకొని - చాలా పైరేట్ గ్రూప్ లు పని చేస్తూ ఉంటాయి . సముద్రాలలో తిరిగి చేపలు పట్టే వారు - ఒక ముఠాగా మారి ఒక నాయకుని ఎన్నుకుంటారు . ఆపై తమకు ఉన్న సముద్ర అనుభవంతో -పైరేట్లు గా మారి అనేక గ్రూప్ లు ఏర్పరుస్తూ వుంటారు .ఎవరికీ రాజకీయ అండదండలు వుంటాయో వారు దొంగల గుంపులన్నిటి మీదా లీడర్ అవుతాడు . ఈ లీడర్ ల నుండి సోమాలీ రాజకీయ నాయకులు వాటాలు పొందుతూ వుంటారు .

హస్సన్ ఒక పారిశ్రామిక వేత్త , ఒక రాజకీయ వేత్త , మరియూ ఒక సోమాలీ దొంగల ముఠా కి ముఖ్య నాయకుడి గా ఎప్పుడు ఏది అవసరమైతో అప్పుడు ఆ పాత్రలు పోషించే మనిషి . **Hobyo-Harardhere Piracy Network** అనే పేరిట ఒక దొంగల ముఠానెట్వర్క్ స్థాపించాడు . పైరసీ అంటే నౌకా పరిశ్రమలలోని ఒక పరిశ్రమ అని ఇతని అభిప్రాయం . **2005 -** నుండీ **2012** ఇతడు తన పరిశ్రమను కొనసాగించి తరువాత దానిని మూసి వేసి తాను దోచుకున్న సొమ్మును నిజమైన పరిశ్రమలలో

పెట్టుబడిగా పెట్టటం ప్రారంభించాడు .అంతర్జాతీయ sపారిశ్రామిక వేత్తగా చెలామణి అవటం ప్రారంభించాడు .

ఒక సోమాలి దొంగల లీడర్ గురించి **6-02-24**

నౌకా నిర్బంధాలకు సోమాలీ దొంగలు ఫెమస్ అయితే -- ఆ దొంగలకు నాయకుడు గా **Mohamed Abdi** హస్సన్. అనే అయన ఫేమస్ . ఇతనికి పెద్ద నోరు అని మారు పేరు { బిగ్ మౌత్ = అనగా మాట్లాడకుండా ఆగలేని వారు అని అర్ధము - వీరు అదీ ఇదీ అని కాకుండా తమగురించి కూడా మాట్లాడేస్తూ వుంటారు ] .ఈ పేరుతోనే దొంగలతో చలామణీ అయ్యేవాడు. సినిమాల్లో విలన్ కి మారు పేరు ఉంటుంది కదా - ఇది అట్లాగా అన్నమాట .

ఇతడు **hawiye =**హవియే అనే తెగకు చెందిన మనిషి . ఎన్నో తరాల కిందట సమాల్ లేదా సామాలి లేదా సామేలు , అనే పేరుతో పిలవబడిన ఒక వ్యక్తి సంతానమే విస్తరించి విస్తరించి అంతా కలిసి సోమాలీ ప్రజలు అయినారని సోమాలీ లు నమ్ముతారు .ఇందువల్ల మేమందరం ఒకే ఇంటి వారము అన్న ఫీలింగ్ సోమాలీలలో ఉంటుంది . .వీరు మాట్లాడే భాష సోమాలీ - ఇదోపియా దేశములోను అధికారభాష . ఇక కెన్యాలో ఒక జాతీయ భాష . కెన్యాలో కూడా అధికులు సోమాలీ భాష వాడుతూ ఉంటారు . ఈ భాషాభి మానము కొద్దీ కెన్యా వారు - సోమాలీలను భాయి భాయీ గా చూస్తూ వుంటారు .భాష మూలకంగా వీరు ఒకరిని ఒకరు ప్రేమించుకుంటూ వుంటారు . ఇక సోమాలి భాష ని అరబిక్ లిపిలో రాస్తారు . అందువల్ల వీళ్ళ పై అరబ్ దేశాల వారికి కూడా ప్రేమ ఉంటుంది . ఈ అరబ్బీలో వుండే సోమాలీ లిపిని సోమాలిలో ని మేధావి ఒకరు లాటిన్ అక్షరాలు కల లిపిగా మార్చారు . ఈ దేశము చట్ట ప్రకారము సోమాలి భాష లిపి లాటిన్ లిపి లో ఉంటుంది .

ఇక ప్రస్తుతానికి వస్తే - **Mohamed Abdi** హస్సన్ పుట్టిన హవియే తెగకు మొదటి మూల పురుషుడు - మొహ్మద్ ప్రవక్తకు కజిన్ బ్రదర్ అని జనం నమ్ముతారు . అన్ని దేశాల్లోనూ కులము మతమూ ప్రజలపై ప్రభావితం చూపుతాయి. కాబట్టి ఈ తెగలోని పూర్వికులు అనేకులు సోమాలీ నాయకులు అయ్యారు . అందువల్ల **Mohamed Abdi** హస్సన్ నాయకత్వ లక్షణాలు తెచ్చుకొని- మొదట దొంగల సామ్రాజ్యము తదుపరి - పారిశ్రామిక సామ్రాజ్యము - ఆపై అధికార సామ్రాజ్యము ఏర్పరిచాడు - .**2005** నుండి **2012** వరకూ అనేక నాకా దొంగ తనాలు చేసి ఆ సొమ్మును అంతర్జాతీయ కంపెనీలలో పెట్టుబడులు పెట్టాడు . నేడు మీరు తాగే ఒక కూల్ డ్రింక్ లో ఇతని పెట్టుబడి కూడా ఉండొచ్చు .

ఇతడు పారిశ్రామిక సామ్రాజ్యము{ కంపెనీలు } స్థాపించిన వెంటనే అనేక దేశాధినేతలు "దాసోహం దాసోహం- రండి మా దేశం వచ్చి పెట్టు బడులు పెట్టండి" అని **i Mohamed Abdi** హస్సన్. ని ఆహ్వానించారు . ప్రపంచంలోని ఏ ధనవంతుడినీ కూడా - నీకీ డబ్బు ఎట్లా వచ్చింది అని ప్రశ్నించకుండానే అతడికి పూజలు చేస్తారు . ఇండియా తో సహా ఎక్కడనైనా అంతేను అని తెలుసుకోవాలిసి వుంది .

ఇతడు వ్యాపార వేత్త గా మారినాక అనేక దేశాలు **Mohamed Abdi** హస్సన్ అహ్వానించి, అతడు తమ దేశం నిరాటంకంగా వచ్చి పోవటాన్నికి వీలుగా అతనికి పాస్పోర్ట్ లు ఇచ్చాయి . ఇతని వద్ద ఒక "డిప్లొమాటిక్ పాస్ పోర్ట్ "కూడా వుంది .

డిప్లొమాటిక్ ప్యాస్పోర్ట్ అంటే - ఏమిటో చూద్దాము . ఇతనికి మలేసియావెళ్ళాడు .డిప్లొమాటిక్ పాస్పోర్ట్ వుంది కనుక - అతన్ని మలేసియా పోలీసులు అరెస్ట్ చేయకూడదు . కోర్టులు అతన్ని విచారించ కూడదు - విమానాశ్రయాల్లో అతన్ని ఆపకూడదు .ఆపిన ఉద్యోగిదే నేరం . ఇలా ఒక డిప్లో మాటిక్ పాస్పోర్టుని కలిగివున్న వ్యక్తిని ఆపేరే అనుకోండి . అప్పుడు- ఆ వ్యక్తిని కాక అతనికి పాస్ పోర్ట్ ఇచ్చిన దేశాన్ని అగౌరవపరిచినట్లు .బేఖాతరు చేసినట్లు భావిస్తారు . రెండు దేశాల మధ్య

వున్నా ఒక ఒప్పందం మేరకే డిప్లమాటిక్ పాస్పోర్ట్ ఇవ్వబడుతుంది కాబట్టి - ఆ ఒప్పందం ఉల్లంఘున జరిగిందన్న భావంతో ఆ తరువాత ఆ రెండు దేశాల మధ్య కయ్యాలు మొదలవుతాయి .

**Mohamed Abdi** హస్సన్ కి డిప్లో మాటిక్ పాస్పోర్ట్ వుంది అంటే అతన్ని ఎదో ఒక దేశము ఇతడు మా దేశము తరుఫున ముఖ్య వ్యక్తి అని చెప్పింది అని అర్ధము . ఎవరు చెప్పారో నిందానంగా తెలుసుకుందాము . లిబియా దేశానికి **Muammar** గడ్డాఫీ అనే ఆయన **1969** నుండి **2011** వరకూ లిబియాని పాలించాడు . ఈ గడ్డాఫీ **- Mohamed Abdi** హస్సన్ ని తమ జాతి **{** అరబ్ జాతి **}** గర్వించ దగ్గ హీరో అని పొగిడి **-** ఇతనిని తమ దేశంలో జరిగే అధికారిక ఉత్సవాలకు ఇతనిని ముఖ్య అతిధిగా ఆహ్వానించాడు . డబ్బు ఉంటే చాలు ఎలాంటి గౌరవాలు ఐనా దక్కుతవి అనేదానికి ఇది ఉదాహరణ .

**2010** నుండి ఇతని నేరసామ్రాజ్యాన్ని **- Al-Shabaab** అనే మిలిటెంట్ గ్రూప్ స్వాధీనం చేసుకోవటం మొదలు పెట్టింది . ఇతడు వారితో రాజీ పడి- తాను ఓడలనుండి సొమ్ము సంపాదించినపుడల్లా **US$100,000** చెల్లిస్తానని ఒప్పందం చేసుకున్నాడు . ఇది చూడటానికి డబ్బు ఒప్పందం లాగా వున్నా **--** ఎదుటి పక్షం వారి దెబ్బకు హస్సన్ బాగా బెదిరి పోయాడు అని తెలుపుతోంది .

ఇక్కడితో ఇతని ఎదుగుదల ఆగి పోయి తరుగుదల మొదలైంది . ఇతడి మీద ప్రేమను పోగొట్టు కోలేని సోమాలీ దేశపు ప్రెసిడెంట్ **-** ఇతడి మీద మోపబడిన నేరాలన్నింటి ని**-** ఇతను కోరిన క్షమాపణ పురస్కరించుకొని రద్దు చేసి నట్లు ప్రకటించాడు . ఈ ప్రెసిడెంట్ గారే **Mohamed Abdi** హస్సన్ కి డిప్లొమాటిక్ పాస్ పోర్ట్ ఇప్పించిన వ్యక్తి అని అప్పుడు బయట పడింది . ఇతడు దొంగ తనాలు మాని ఆ పని తన కొడుకుకు అప్పగించాడు . ఇతడు తండ్రి ఇచ్చిన సొమ్మును తీసుకెళ్లి కెన్యాలో మత్తు పదార్థాల పండించటం లో పెట్టు బడి పెట్టాడు .

హస్సన్ ఓపిక లేని పులి అయినాడు .అప్పుడు బ్రెజిల్ వారు ఇతని పని పట్టాలి అని రహస్య నిర్ణయం తీసుకున్నారు. .2012 లో , ఇంటర్ పోల్ ద్వారా ఇతని పేరుమీద లుక్ అవుట్ నోటీసు జారీ చేయించారు . అట్లాగా ఇతడు అంతర్జాతీయ నేరస్థుడు అయినాడు . అంతర్జాతీయ నేరస్తులకు - ఏదేశము రక్షణ ఇవ్వకూడదు - కాబట్టి డిప్లొమాటిక్ పాస్పోర్ట్ వంటివి అరెస్టును ఆపలేవు .

ఇది ఇట్లా జరుగుతుండగా **Mohamed Abdi** హస్సన్ బిగ్ మౌత్ కాబట్టి అనగా ఎక్కువగా మాట్లాడే అలవాటు వున్నా వాడు కాబట్టి పత్రికల వాళ్ళని - టీవీల వాళ్ళని పోగేసి వాళ్ళకి ఇంటర్వ్యూలు ఇస్తూ వచ్చాడు . గద్ద ల వంటి మేము దొంగతనాలు మాని వేసి శాంతి కాపాతాళము అయినాము అని స్టేట్మెంట్లుఇచ్చాడు .

అప్పుడు బెల్జియం నుండి ఒక సినిమా కంపెనీ వారు ఇతని దెగ్గరికి వచ్చి " నీ జీవితం- పాపము చేసినందుకు నీవు పాస్చాత్తాప పడటం వంటివి వంటివి ప్రపంచానికి స్ఫూర్తి దాయకంగా వున్నవి - చేసిన పాపానికి పాస్చాత్తాప పడిన గొప్ప హీరో లాగా చూపిస్తూ నిన్ను పెట్టి- నీజీవిత కథను ఒక సినిమా తీస్తాము " అని చెప్పారు .

సినిమాలో నటించాలని హాసన్ **2013** లో బెల్జియం వెళ్ళాడు . ఇతడు బెల్జియం లో విమానం దిగంగానే ఇతడిని అక్కడి పోలీసులు అరెస్ట్ చేసి కోర్టుకు పంపారు . **2009** లో బెల్జియం కి చెందిన ఒక డ్రెడ్జింగ్ నౌకను ఇతడు చెరపట్టగా - ఆ నేరం మీద ఇతన్ని విచారించి **-March 2016** లో ఇతనికి ఇరవై యేండ్ల జైలు శిక్ష విధించారు .

సినిమా తీస్తామని వచ్చింది బెల్జియం గూఢచారి విభాగం వారేనని - వారు ఈ మెగా దొంగ యొక్క అసలు వీక్నెస్ మీదా దెబ్బకొట్టి తెలివిగా అతడిని పట్టుకుని విచారించారని - ప్రంపంచము బెల్జియం దేశాన్ని మెచ్చుకుంది . తెలుగు సినిమాల్లోవిలన్ కూడా తనకు వున్నా బలహీనత వల్లే ద్దొరికి పోతాడు .మన దేశం వదిలి పారిపోయిన నేరస్థుల పట్ల మనము ఇట్లాటి ప్రయత్నాలు ఏ మన్నా చేశామా అని వెతుకుతూ వున్నాను- ఉంటే

రాస్తాను  ? చిత్త శుద్ధి  ఉంటె మనకూ ఏదో ఒక దారి దొరికి ఎవర్నో ఒకర్ని పట్టుకొనే ఉంటాము .

పరి శోధన వివరణ - వారణాసి శ్రీ రామకృష్ణ అమరావతి .

**—---------- the end —--------------**